# మానవ హృదయాలు

[ బెంగాలీ నవల ]

మాతృక :

(వనఫూల్)

★

అనువాదం :

" నీలకంఠం "

ఉదయ సాహితి
విజయవాడ - 1

# మానవ హృదయాలు



చలిచలిగా జ్వరం వచ్చినట్లుంది. అవును జ్వరమే! ఈ జ్వరంలో 'ఆమెకు' ఉత్తరం రాస్తున్నాను. 'ఆమె' వివాహం ఇంకొకరితో స్థిరపడిపోయినప్పటికీ—నాప్రయత్నం వొట్టి మూర్ఖమని తెలిసుండికూడా—రాస్తున్నాను. ఐనా-నా కవిత్వం మాత్రం కుంటుపడలేదు. జ్వరం వచ్చినట్లుంది. జ్వరంలోనే వాగుతున్నాను.

''మనసులోని సంగతు లేమని చెప్పదు రాణీ!
వ్యధా భరిత హృదయా న్నేమని తెలుపుదు పాషాణీ!
ఈ మనసులోని కోరిక నీ వెలా తెలుసుకుంటావో
నా నిట్టూర్పే నీదిగదా, ప్రియసఖి పాషాణీ!''

ప్రేమ జగత్తులో ఇరుక్కొని ఏ మేమిటో పాడుకుంటున్నాను. అంతా చీకట్లో మునిగిపోయింది. ఆఖరికి ఇంటి కిటికీలు కూడా మూయబడి వున్నయ్! నా ఎదురుగా వున్న కిటికీ సందులోంచి చిన్న వెలుతురు కిరణం ఒకటి లోపలకు దూసుకవస్తుంది. ఆ సన్నని కిరణపు వెల్తుర్లో గదంతా అస్పష్టంగా కనిపిస్తూవుంది. మంచి చెడుగులుకూడా కనిపిస్తున్నయ్. బాణంతో కొట్టబడిన పక్షిలా చీకటి మూర్ఛపోయి పడివుంది. అయితే—ఇంతకీ నే కలనేమన్నా గంటున్నానా? ఏకల కంటున్నాను? మృత్యువును గురించా?

"డాక్టరుగారూ ?—"

త్రుళ్లిపడి—"ఎవరూ? లోపలికి రండి" అన్నాను.

ఒకతను లోపలికి వచ్చి దర్శనమిచ్చాడు. నలభై ఏళ్లుంటాయి. మెల్లగా నవ్వి "తమర్ని కొంచెం కష్టపెట్టాలని వచ్చాను నెలరోజుల్నుంచీ నా భార్యమనసు పాడైపోయిందండి. మా పక్కింట్లో భజనలు చేస్తూవుంటారు. ఒకనాడు అక్కడికి వెళ్ళి వచ్చింది. అంతే-అప్పట్నుంచీ దాని మనసు పాడైపోయింది" అన్నాడు.

"అసలు సంగతేమిటో వివరంగా చెప్పండి?"

"ఏం చెప్పమంటారండి? భజనకు వెళ్ళేముందు బాగానే వుండేది. అక్కణ్నుంచి పదకొండు గంటల రాత్రప్పుడు ఇంటికి తిరిగి వస్తూనే "నా నందగోపాలుడు ఏడీ?" అనీ 'మా గోవిందుడెక్కడా' అనీ-ఒకటేగోల. మాటి మాటికీ అదేవరస. అడగడం, పాడడం; పాడడం అడగడం. ఏమిటో నాకంతా అయోమయంగా వుందండి డాక్టరుగారు తమరేదైనా మంచి మందు [illegible]

" మీ భార్య ఎక్కడుంది?"

" నా వెంబడే తీసుకవచ్చాను; బండ్లో వుంది."

"ఇక్కడికి తీసుకరాండి "

ఆయన తన భార్యను లోపలికి తీసుకవచ్చాడు ఏమంత పెద్దవయసు కాదు చిన్నపిల్లే! జుట్టు విరబోసుకొనివుంది. గుడ్డలన్నీ చింకరపందరగా వున్నయ్. నన్ను చూడ్డంతోనే "నన్నెందుకని పిలిపించారు. మీరు నన్ను పిలిపించారటగా?" అని ఆమె అడిగింది.

"అవును కూర్చోండి."

ఆపక్కనున్న కుర్చీలో దఢాలున కూర్చుని తల ముందుకు చాపి "మీరెందుకు పిలిపించారో చెప్పండి?" అన్నది.

"ఏమిటలా అరుస్తారు? మీకు మతిపోయిందా యేం?"

నావేపు ఒక క్షణంసేపు కళ్ళుచించుకుని చూసి "నాకేం పోలేదు. మీకేమన్నా పోయిందేమో వెతుక్కోండి." అన్నది.

"మీరు ఇంట్లో గోలచేస్తారనీ, 'నా నందగోపాలుడా-నా నల్లనయ్యా' అని పాడుతారనీ మీ ఆయన అంటున్నాడు...."

"అయితే ఆ పాటలు మీరు వింటారా? మీరెప్పుడూ విననేలేదా?—ఐతే వినండి!

"నందగోపాలా, నందకిశోరా;
ఒంటరినానను జాగేలరా,
లోకముపై చీకటి చేతులు సాచే
హృదయమేమొ గజగజ భీతిల్లె
నీ రాక లే దేమి సేతురా
చిరుగజ్జెలు గళ్ళు-గళ్ళన
గళ్లన-చిరుగజ్జెలు, గల్లుగల్లన
నందగోపాలా - నందకిశోరా!"

ఏమేమిటో మతిలేకుండా పాడుతూవుంది. ఎందుకోసమో పాట అకాత్తుగా ఆపి తెల్లబోతూ నా ముఖంవేపుకు చూసింది. నేను వెనక్కు తిరిగి చూసాను. పొరుగింటి దాసీమనిషి నిలుచుని వుంది.

పాడుతున్నదల్లా దాసీమనిషి చేతిలోని పిల్లవాణ్ణి చూసి "రా, నాయనా! నావద్దకు రా! రా....రా....' అని అన్నది.

ఆ పిల్లవాడికి మూడురోజుల్నుంచీ జ్వరం తగుల్తూవుంది నాకు చూపించేందుకు దాసీని ప్రతిరోజూ ఆ పిల్లవాణ్ణి తీసుకు వస్తూవుంది.

"రా నాయనా! నీకు పెద్ద బొమ్మ యిస్తాను నా దగ్గరకు రా. రావూ? రావూ?—ఓరే, నువెక్కడి వెధవ్వురా?" అంటూ వెళ్లి, ఒక్క వూపున పిల్లవాడిని లాక్కుని గుండెలకు అదుము కుంటూ కళ్లు మూసుకుంది

ఆ పిల్లవాడు గట్టిగా ఏడ్చాడు 'అయ్యో అయ్యో' అని దాసీది అరుస్తూనేవుంది బలవంతాన ఆమె దగ్గర్నుంచి పిల్లవాణ్ని లాక్కున్నాను. దాసీది పిల్లవాడితో పారిపోయింది

ఆమె కళ్ళవెంట నీళ్ళు జలజల రాలినయ్ కన్నీళ్ళతో ఆమె నావేపు చూసి "ఏ పిల్లవాడూ నా వొళ్ళోకి రాడుకామోలు! అంతేనా?—ఐతే ఎందుకని రారో చెప్పండి డాక్టరుగారూ?" అని అడిగింది.

ఆ పిచ్చిదాన్ని పరీక్ష చేసి మైజు పున్న బంధి ఎక్కించాను. ఆతర్వాత ఆ భర్తను పిలిచి "మీకెంత కాలం నుంచి 'గనేరియా' వుంది?" అని అడిగాను.

ఆయన ముందు కొంచెం భయపడ్డాడు ఆ తరవాత "పది సంవత్సరాలవుతుంది. నా కిప్పుడు ముప్పై సంవత్సరా లున్నయ్" అన్నాడు

"ఐతే-పిల్లా పిచేమన్నా కలిగిందా?"

"కలిగిందండీ కానీ, పుట్టడంతోనే చనిపోయింది"

కొంచెంసేపు వూరుకుని "మీ భార్య వొంటిమీద నల్లని

కొరడాదెబ్బల మచ్చలు వున్నయ్. మీ రేమైనా కొట్టారా?" అని అడిగాను.

ఆయన కొంచెంసేపు నా కళ్ళల్లోకి చూసి "అవునండి. రెండు మూడు రోజుల క్రితం కొట్టానండి. "ఆడదాన్ని కొట్టందే లొంగదు" అని మా బంధువులంతా అంటుండే.... ఐనా ఎక్కువగా కొట్టలేదండి! పూరికే...." అని పూరుకున్నాడు.

"సరేలెండి. దయచేసి యికనించి కొట్టకండి. బిడ్డలు కలగనంతకాలం ఆమె యిలాగే వుంటుంది. ఐతే బిడ్డలు కలుగుతారని నమ్మకం నేను చెప్పలేను. ఐనా కొంతకాలం మందులవల్ల ప్రయత్నం చేసితీరాలి. తమ పేరేమిటి?

"గోపాల్రావు"

అతనికి మందు రాసిచ్చి పంపాను.

ఆయన బైటికి వెళ్ళాడో లేదో, మా పక్కింటి హరీశుడు వచ్చి 'డాక్టరుగారూ, ఎవరో పిచ్చిది పిల్లవాడి గొంతు నులిమిందటగా?" అని అడిగాడు.

ఆయనగారికి జరిగిన సంగతంతా చెప్పాను.

"అలానా! సరేలెండి. మీ రొకసారి వచ్చి పిల్లవాణ్ణి చూడండి" అని హరీశుడు అన్నాడు.

"వస్తాన్లే: కానీ, 'గ్లూకోజ్' ఇస్తున్నారా?"

"ఇంకా కొనలేదండి. ఇవాళ ఎలాగైనా తెస్తాను. నా జీతం చాలాతక్కువని మీకుతెలుసు. ఎనిమిదిమంది పిల్లలు! పెద్ద కుటుంబం. మీబోటి సత్పురుషుల ఆశీర్వాదంవల్ల బండి నడుపుకుంటూ వస్తున్నాను. దయుంచి మీరొకసారి పిల్లవాణ్ణి చూడండి. 'గ్లూకోజ్' ఇవాళ తప్పక తెస్తాను.

హరీశ్ బాబు వెళ్ళిపోయాడు. బీదవాడవడంచేత ఎప్పుడూ పిల్లాపీచుతో తంటాలుపడుతూవుంటాడు. ఎంత బాధపడుతూ వున్నా నిన్నటి సాయంకాలంవరకూ 'కామవర్ధని' ఇ౦జెక్షనులు తీసుకోవాలనే అతను నాతో సలహాలు, సంప్రదింపులూ జరిగించాడు. మానవుల మనసుకూడా మహా అద్భుతమైనదే' నన్ను నేను చూసుకున్నపుడు విస్మయం కలుగుతూ వుంటుంది

విద్యార్థిగావున్న నా జీవితం గుర్తుకువస్తుంది. ఆరోజుల్లో ఎంతో నిష్ఠగా వుండేవాణ్ణి' నా 'స్టౌ' మీద పొరుగింటివారి అమ్మాయి కోడిగుడ్లు వండుతుంది ఆ 'స్టౌ' తీసి బయట పారేశాను. కానీ, ఇవాళో?-ఈనాడు కోడిమాంసంలేకుండా 'ముద్ద' పోషణంలేదు. కోడిమాంసమనేమిటి? నిషేధించిన మాంసాలుకూడా నాకు అడ్డంకికావు. మానవుడు ఇరవైనాలుగు గంటల్లో మారిపోతూనే వుంటాడు. ఈనాటి నేను సంవత్సరమయాక—సంవత్సరందాకా ఎందుకు? కొన్ని నెలలలోపునే ఇంకొక వ్యక్తిగ, ఇంకొక రకంగ మారిపోతానేమో!

స్కూలూ, కాలేజీ, విశ్వవిద్యాలయం, ధర్మం, ఆచారం, హితోపదేశం, ఇవన్నీ "మాతృవత్-పరదారేష్" [పరాయిస్త్రీలు తల్లులవంటివారు] అని నేర్పుతూవుంటాయి పెద్దలు, మహాత్ములు బోధిస్తుంటారు. ఐనా నేను పరాయి ఆడదాని ప్రేమతో బాధపడుతున్నాను. మీరు నవ్వుతూవుంటారనుకుంటాను; నవ్వకండి! 'ఆమె' పరాయి ఆడది కాదు. నా అస్థిత్వమంతా పుచ్చుకుంది .. ఇంకా ఇంకా ఎక్కువగా చెప్పడమెందుకు? నేను డాక్టరును. కవినికూడాను! ఒకవేళ మీరు నా జీవిత చరిత్ర వినాలనుకుంటే

నా కవిత్వాన్ని మీరు తప్పక చదివితీరాలి. నా కవిత్వంలోనే నా జీవితచరిత్రను గురించి రాసాను.

"డాక్టరుగారూ?"

"ఎవరూ....? లోపలికి రాండి."

# 2

నాలుగువేపులా కటికి చీకటి కారట్లాడుతూవుంది. నదిలో చిన్నపడవమీదకూచుని వెళ్తున్నాను. మా వూరికి దూరంగా వున్న ఒక గ్రామములో ఒకబ్బాయికి జబ్బుచేసింది. ఆ యబ్బాయిని చూసి మందిచ్చేందుకే వెళ్తున్నాను.

నిబిడాంధకారముమధ్య నదీమతల్లి మాట్లాడుతున్న భాష వింటున్నాను. వేగంగా ప్రవహించే గంగానదీమతల్లి భాషా, ప్రవాహంలోని కలకలారవమూ నన్నెక్కడికో లాక్కుపోయినయ్. నేను ఆనందంతో కళ్ళుమూసుకున్నాను. మెల్ల మెల్లగా ఎక్కణ్ణుంచో 'నా రాణి' వచ్చి నన్నంటుకుని కూచుంది. ఏ విధమైన చప్పుడూ లేదు. పడవ పోతూనేవుంది. ప్రవాహము తన గోడు చెబుతూవుంది. కాలం గడిచిపోతూవుంది. 'నా రాణి' తన శరీరాన్ని నా శరీరానికి ఆనించి కూచుంది. సున్నితమైన 'ఆమె' స్పర్శను అనుభవిస్తూ శతాబ్దాలు శతాబ్దాలు గడిపినట్లు కూర్చున్నాను. ఆ స్పర్శవల్ల, నా తనువు, మనసు, ప్రాణం, కష్టపడిపోయింది. హృదయంలోంచి ఆవేదనలాంటి ఏడుపు పొంగి పొర్లింది. తీయని బాధామయమైన ఈ అనుభూతిని ఏమని

వెల్లడించను? దీన్ని ఏ విధంగా నిరూపించను? విడమరిచి వెల్లడి చేసేందుకు శబ్దాల్ని ఎక్కణ్నుంచి తీసుకరాను? నా హృదయం కవిత్వంతో నిండిపోయింది

"కటికి చీకటిలోన
కారు మొయిలులోన
కన్నుమూసుక నేను
కాంచితిని నీ రూపు
దివ్యతేజము తోడ
చేసితా రావే!
వచ్చి నా హృదయములో
చొచ్చుకొని పోవే!"

పనికిరాకపోయినప్పటికీ ఆమె స్వరం వింటున్నాను.

"పగలు నేను నీకేమీ కాను. సూర్యభగవానుడి వెలుతుర్లో నేను లోకానికీ, సమాజానికీ పనికివస్తాను. కటికి చీకటి రాత్రి పూట నేను కేవలం నీదాన్ని" అని అన్నట్లుగా వుంది.

"ప్రియసఖీ! అప్సరసా!
ఈ జీవితమే నాశనమా!
దాగుడుమూతల దోబూచులకు
దరిదాపుల నీవే లేవా?"

ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాలు నా శరీరానికి తగులుతూ వున్నయ్! తల వెంట్రుకలతో ఆమె నా శరీరమంతా కప్పింది. అనంతాకాశ మధ్యంలో నక్షత్రాలు మిణుకు మిణుకు మంటున్నయ్. చీకటిని తరిమినట్లుంది

"నన్ను మరచిపోవొద్దు. నే నుండడంచేతనే మీరు బతక గలుగుతున్నారు. నా వునికిలోనే మీ వునికి యిమిడివుంది. మీ అంతట మీరు పగటిపూట ఎప్పుడైనా ప్రకాశించగలిగారా? నా గుండెల మీదనే మీ జ్యోతి తళుక్, బెళుక్‌మంటూ వుం టుంది సుమా!" అని నీకటి చెబుతున్నట్లుగావుంది

హే అంధకారమా! నీకు నా హృదయపూర్వకమైన నమ స్కృతులు! హే నక్షత్ర నివాసస్థానమా! నీకు నేను నమస్క రిస్తున్నాను. నువ్వే నా స్వప్నసాగరానికి నావికవు! అసంభవాన్ని సంభవంగానూ, దూరాన్ని దగ్గరగానూ, అంతర్గతాన్ని బాహ్య రూపంలోకి లాక్కువచ్చే శక్తి సామర్థ్యాలు చేతులో పెట్టుకున్న దానా! నువెంతో గొప్పదానివి! నువు చిరంజీవివి! స్నేహమయీ నా నమస్కృతులు తీసుకో. ఐనా-ఎంతకాలంవరకు? ఎంతకాలం వరకు తమ అస్తిత్వం నిలబడివుంటుందో అంతవరకూ నా నమ స్కృతుల్ని స్వీకరించు. వెలుతురురథం తన చక్రాల్ని ధ్వని చేస్తూ వచ్చేస్తూవుంది.

అప్పుడు నువ్వు....? నా ప్రాణేశ్వరీ! నువెక్కడ దాక్కుని వుంటావు? అపురూపమైన నీసౌందర్యాన్ని ఎక్కడ దాస్తావు? ఈ స్నిగ్ధ మధుర ముఖాకృతి....!

'ఆమె' శ్వాస, నిశ్వాసాలు ఎక్కువవుతూవున్నాయ్. ఆలిం గనంలోని పటుత్వం తగ్గుతూవుంది! నల్లని తన కేశరాశిని ముడివేసుకుని నాదగ్గర్నించి వెళ్ళిపోవాలనే కోరికతో వున్నట్లుంది.

"క్షణంసేపు ఆగవా?"

అయినా ఎక్కడుంది? వెళ్లిపోయింది....వెళ్లిపోయింది.

"బాబుగారూ, మెల్లగా దిగండి" పడవనడిపేవాడు అన్నాడు.

"ఎందుకు? ఏమన్నా వుందా?"

"ఏదో శవం కింద పడవకు తగులుకున్నట్లుంది"

కిందకు దిగి చూసేప్పటికి ఒక ఆడదానిశవం పడవకు తగులుకుని వుంది వెంట్రుకలు నీళ్ళల్లో ఈదుతూవున్నయ్. పెదిమలమీద, బుగ్గలమీద మాంసంలేక పండ్లికిలిస్తూ భయంకరంగా నవ్వుతున్నట్లుగా వుంది

నేను ఏ రోగినైతే చూడాలనుకుని వచ్చానో, ఆ రోగి తాలూకువాళ్ళు లైట్లుపట్టుకుని వొడ్డున నిలుచుని వున్నారు. నేను దిగీ దిగడంతోనే రోగి తండ్రి నయసవాడు వచ్చి నా రెండు చేతులూ పట్టుకుని "డాక్టరుగారూ, కొంచెందూరం నడిచివెళ్ళాలి. మీకోసం సాయంకాలంనించీ మేమంతా ఎదురుచూస్తున్నాం" అన్నాడు.

ఆయనగారింటికి వెళ్ళిరూ మన్నా: "జబ్బు ఎప్పట్నుంచి?" అని అడిగాను.

"ఎనిమిది రోజులైందండీ"

"ఇంతకుముందు ఏ మందు వాడారు?"

"ఎలోపతి వైద్యం మా కెప్పుడూ సరిపోలేదు. అ కారణంతో హోమియోపతి మందు వాడుతున్నాం కానీ, రోగం ఎక్కువైంది. ఏమీ పాలుపోక మీకోసం కబురు పంపాము"

"సరే" అని రోగిగదిలోకి వెళ్లి పరీక్షించాను. డబుల్ నిమోనియా అని తేలింది. ఆ రోగిపరిస్థితికూడా బాగుండలేదు ఈ రాత్రి గడవడమే కష్టం! రోగికి స్పృహలేదు. ఆస్థితిలో వున్న

ప్పటికీ కలవరిస్తూనే వున్నాడు "అదిగో కోశావు. నీవు చూడ్డం లేదూ? బ్బ! ఎంతరక్తం! నన్నిక్కణ్ణుంచి తీసుకొని వెళ్ళండి. అదిగో ఇంకొకళ్ళల సరికారు! అరే చూస్తారేం? పోలీసుస్టేషనుకు కబురు చేయండి! పద... పద ..."

ఇదే వరస. కలవరింతలు తమాషాగా వున్నయ్.

ఆ రోగి తండ్రిని బయటకుపిలిచి యదార్థం చెప్పాను. అంతా విన్నాక ఆ తండ్రి "డాక్టరుగారూ, ఈరాత్రికి మీరు ఇక్కడే వుండండి. మీరు వెళ్ళకండి. మీకెంత ఫీజు కావాలో అంత ఇస్తాను, మీరు మాత్రం వెళ్ళకండి" అన్నాడు,

"నే నిక్కడ వున్నందువల్ల లాభ మేమిటి?"

ఎన్ని చెప్పినా ఆయన వినలేదు. ఆఖరికి నేను అక్కడే వుండవలసి వచ్చింది. "సరే, మీరొక పని చేయండి. అయినా ఒక మనిషి మాత్రం తప్పకుండా రోగిని కనిపెట్టుకొని ఈ రాత్రంతా వుండాలి. వంతులు వేసుకుని మీరంతా ఒకరి తర్వాత మరొకరు రోగి దగ్గర మేలుకొని కూర్చోవాలి. మధ్య మధ్య నేనూ వచ్చి చూస్తుంటాను. మీ ఇంట్లోని వాళ్ళంతా ఎంత మంది?" అని అడిగాను.

"నేనూ....మహేంద్రుడూ, కోడలూ, నా భార్య. అటు వంటప్పుడు రోగి దగ్గర కోడల్ని వుంచుదామా? నా భార్యకూడా రోగంతో మంచంలో వుంది. భయంకరమైన తల నొప్పి దాన్ని పట్టుకుంది. తమరు కొంచెం అటువేపుకూడా ఒక కన్నుంచాలి. దాని దగ్గరకూడా ఒక మనిషి వుండాలి. బాబుగారూ! కష్టాల నేవి ఇలానే వస్తే ఒకదానిమీద మరొకటి వస్తూనే వుంటాయి."

ఆయన భార్యనుకూడా చూశాను పదహారు పదిహేడు సంవత్సరాల వయసుంటుంది. ముందో భార్యట! ముందో భార్యను ఏ విధంగా జరగాలో అంత ఇదిగానే జరుగుతూ వుంది. 'యాస్పరిన్' మాత్ర ఒకటిచ్చి - నిద్రపోవాలని హెచ్చరిక చేసి ఆ ముసలాయనతో "ఈమెగారు చాలా భయపడుతూవుంది. తమరు ఈమె దగ్గరే వుండండి! అవసరం కలిగినప్పుడు మిమ్మల్ని పిలుస్తాను" అని అక్కణ్ణుంచి వచ్చి, కొడుక్కి కావలసిన ఏర్పాటులు చేసాను.

ఎంతోసేపు ఆలోచించి అతనికి ఇంజక్షన్ యిచ్చాను. ఒకామె రోగి తలవద్ద కూచుని చన్నీటి గుడ్డను నొసలుమీద అద్దుతూ వుంది. ఆమె రోగికి భార్య కావొచ్చు! మహేంద్రుడు– అంటే - రోగి మేనమామగారు ఆ దగ్గరే నిలుచుని వున్నాడు ఇంజక్షన్ యిచ్చాక అతను నాతో "పదండి డాక్టరుగారూ! ఏదైనా కొంచెం తిని 'టీ' తాగుదాం! మీరు 'టీ' తాగుతారు కదూ? అని అడిగాడు.

"ఆ "

మే మిద్దరం బైట వరండాలో కూచుని టీ' తాగుతూ వున్నాం లోపల్నుంచి రోగి పలవరింతలు వినపడుతూనే వున్నయ్.

"అదిగో. అదిగో ఓ హో! బొటయాను నరేంద్రుడుకేం పిచ్చోగాని సరిగ్గా ఆడనేలేడు. చూరోయ్! ఒక్క బీడీ ఇవ్వు." పాపం ఇదీ ధోరణి!

నా దగ్గర కూచునివున్న మహేంద్రుడు "డాక్టరుగారూ!

వీళ్ళు వొట్టి పరమలోభులండి. నేను రాసుల్లయితే మిమ్మల్ని పిలిచే వాళ్ళేకారు.'' అన్నాడు.

నేను నవ్వుతూ "నేను వచ్చినా ఏమవుతుంది? అతను బతుకుతాడనే ఆశ లేదు" అన్నాను.

ఆ మాట విని ఆయనగారేమీ చలించలేదు. "ఇందులో మీ తప్పేముందండీ? మొదట్నుంచీ మీదగ్గర మందు తీసుకుంటే బావుండేది. కానీ, వీళ్ళు పరమలోభిముండాకొడుకులు! వీళ్ళసంగతి మీకు తెలియదు డాక్టరుగారూ! నేనొక నల్లమందు రాయుణ్ణి లెండి! కుర్రవాడికి జబ్బుగావుందని విని పరుగెత్తుక వచ్చాను. డాక్టరుగారూ మీరు నమ్మరు కానీ. వచ్చినప్పట్నుంచీ ఒక పాల చుక్క కూడా నోట్లో పోసుకోలేదు. పుత్ర వాంలవెధపలండీ, మాల వెధవలు ...' అని అన్నాడు.

ప్రసంగాన్ని మార్చాలనే వుద్దేశ్యంతో "ఈ కుర్రవాడు ఏంచేస్తుంటాడు?'' అని అన్నాను

"చేసేదేముంది లెండి; బి ఏ. ఫెయిలై వివాహం చేసుకున్నాడు ఆనుమానాలై వుంది. అతనికి భయమేమిటిలెండి. తండ్రికి ఒక్కగాని ఒక్కకొడుకు! దగ్గర బోలెడంత రొక్కం వుంది. వ్యాపారంకూడా వుంది. పెద్దలోగిలి. భూమీపుట్రావుంది. అటువంటప్పుడు ఏంచేయవలసినవసరం? అసలా తండ్రి వద్దతే అంత! చిచపమంటూ వివాహాలు చేసుకుంటున్నాడు. మొదటి భార్య రోగంతో తీసుకొని తీసుకొని, చికిత్సా పథ్యం లేకుండా చనిపోయింది. రెండోభార్య పాముకాటువల్ల మరణించింది. మూడోదాన్ని ఇప్పుడు తీసుకొనివచ్చాడు. ఈమెగతి యెలావుంటో మీరు చూస్తున్నారుగా'' అని కొంచెంనేపాగి "నేను చెబుతున్నా

నుగా. వీళ్లు వొట్టి పరమలోభులండి నేను నల్లమందుతినేవాణ్ని! నా కోసం ఒక్క చటాకు పాలుకూడా వీళ్లు తీసుక రాలేదు" అన్నాడు.

ఆ విషయం మారుద్దామనే వుద్దేశ్యంతో మీ రిక్కడే కూచుని వుండండి నేను లోపలికి వెళ్ళి రోగిని ఒకసారి చూచి వస్తాను" అని రిష్టువాచి చూశాను ఒకటిన్నరయింది.

రోగిదగ్గరకు వెళ్ళి చూసినదృశ్యం! నాకళ్ళను చీల్చినట్లయినయ్. ఆ అభాగ్యుడు ఆఖరిగాలి పీలుస్తున్నట్లున్నాడు అతని భార్య విసిరి విసిరి అలసటతో నిద్రపోతూవుంది. చేతిలోని విసన కర్ర అలాగేవుంది. ముఖంమీద విచారరేఖలు కనిపిస్తున్నయ్. ఆమెనొసటిమధ్య ఎర్రని బొట్టు అగ్నిస్ఫులింగంలా జాజ్వల్యమానంగావెలుగుతూవుంది. నేనామెను లేపలేదు. సంచి తెరిచి ఇంకొక ఇంజక్షన్ తయారుచేసి రోగిదగ్గరకువెళ్లి చేయి పట్టుకున్నాను. ఇంకేముంది ? అంతా అయ్యిపోయింది.

బయటకు వచ్చి, మహేంద్రుని గదిలోకి తీసుకొనివెళ్లాను.

నిర్ప్రాణంగా పడివున్న శవాన్నిచూసి మహేంద్రుడు "ఆఖరైందా? వాడికి కొడుకు బతకాల నెందుకువుంది? ఈ ముాత పెట్టిన వస్తువేమిటో—?" అన్నాడు.

"పాలనుకుంటాను"

"ఎంగిలి చేసాడా?"

"లేదేమో."

"అయితే వీటిని వూరికినే పోసీయడమెందుకు?" అని మహేంద్రుడు గడగడమని తాగాడు.

ఇంటి కోడలు మేలుకుంది. భయంతోనూ, సిగ్గుతోనూ

విసనకర్రతో విసురుతూవుంది. ఆ గాలి ఎవరికై తగుల్తుందో ఆ అభాగ్యురాలి కేం తెలుసు?

మహేంద్రుడు అందరికీ చెప్పాడు. ఇల్లంతా యేడుపులతో మునిగిపోయింది. నేను మెల్లిమెల్లిగా బైటకువచ్చి వరండాలో కూచున్నాను. మేనమామగారు వచ్చి నా ఫీజు యిచ్చాడు. ఆ డబ్బు పుచ్చుకున్నాను.

"ఒకసారి వాయించి చూసుకోండి డాక్టరుగారూ. వట్టి వెధవ! పూటా రూపాయలుకూడా యిస్తాడు" అని ఆయన మళ్లీ అన్నాడు.

అదే పడవ మీద ఇంటికి తిరుగు ముఖం పట్టాను. ఆకాశంలో ఒకమూల వెలుతురు రేఖలు ఉదయిస్తున్నయ్! నది మాత్రం ఆ విధంగానే ప్రవహిస్తూ వుంది.

ప్రయాణం ముగిసింది. నావ వొడ్డుకు చేరింది. నేను దిగి భూమ్మీద కాలు పెట్టానో లేదో, ఒక మనిషి నా ఎదుట వినయంగా నిలుచుని "డాక్టరుగారూ! నిన్నటి సాయంత్రంనుంచి మీ కోసం వెతుకుతున్నాను". అన్నాడు.

అతణ్ని నేను గుర్తుపట్టలేక పోయాను. "తమరు ఇక్కడ ఎక్కడుంటున్నారేం?" అని అడిగాను.

"నేనిక్కడుండేవాణ్ని కాదులెండి! నాలుగైదురోజులు షికారు కని ఇటువేపు వచ్చాను."

"మంచిదేలెండి!"

పరకాయించి అతణ్ని చూశాను. నలభై అయిదు సంవత్సరాల వయసుంటుంది. "అయితే తమకి యిప్పు డేం కావాలి?" అన్నాను.

"ఒకసారి తమరు మా యింటికి రావాలి. మా బావమరిది కొన్ని రోజులనుంచి జ్వరంతో తీసుకుంటున్నాడు యింట్లో ఇంకె వరూ లేరు. వస్తారుకదూ? ప్రస్తుతం మేం ఎర్రకోటలో వుంటున్నాం."

"సరేలెండి—"

ఎర్రకోట చేరాను. నాకోసం ప్రాణకృష్ణబాబు ఎదురు చూస్తున్నాడు. ఆయన్ని తీసుకొని లోపలికి వెళ్ళి రోగిని పరీక్షించి మందుచీటి రాద్దామని కూచుని రాస్తూ, మధ్యలో కళ్ళెత్తి చూసాను. ప్రాణకృష్ణబాబు పొరుగింటి డాబా మీదికి తన చూపుల్ని కేంద్రీకరించి చూస్తున్నాడు. తల వొంచుకుని నేను ఆ డాబావేపు చూసాను. ఒకమ్మాయి డాబామీద గుడ్డలు ఆరవేస్తూవుంది. నిర్వికారంగా ఆమె అటూ ఇటూ చూసి మొహం తిప్పుకుంది. మూర్ఖునిలా ప్రాణకృష్ణబాబు నిలుచుని వున్నాడు

బావమరిదికూడా ఈ దృశ్యం చూసినట్లున్నాడు అంత జ్వరంలో కూడా నవ్వుతున్నాడు

హఠాత్తుగా ప్రాణకృష్ణబాబు "ఓహో. ."అని అన్నాడు.

నేను ఆశ్చర్యంగా "ఏమిటండీ?" అని అడిగాను.

"ఏమీ లేదండి .. మీదగ్గ దాపరికమేమిటిలెండి. బైటికి రాండి చెబుతాను."

బైటకు వచ్చాక ప్రాణకృష్ణబాబు "ఇదికూడా ఒక ఇబ్బందేనండి. ఆ పొరుగింటి డాబామీద ఒకమ్మాయిని చూసారు కదూ?" అన్నాడు.

"అవును చూసాను"

ఆయన నా చెవులో "అది నా ప్రేమలోపడి కొట్టుకుం టూవుంది" అన్నాడు.

"మీ కెలా తెలుసు?"

"నేను ఈ గదిలోకి రావడమే తడవుగా ఆమె డాబా మీదికి పరుగెత్తుక వస్తుంది. నన్ను చూడడంతోనే సిగ్గుతో ముఖం ఎర్రగా చేసుకుంటుంది. ఇది ప్రేమ కాకపోతే ఇంకేమి టండీ?"

ఇక నే నేమని చెప్పను? బలవంతాన నవ్వు ఆపుకున్నాను. ఈసమయంలోనే ఒక నల్లటి మనిషి మావద్దకు వచ్చాడు. ఆయన్ను చూసి కృష్ణబాబు సంతోషంతో "రాండి, రాండి; ప్రసన్నబాబుగారూ, రాండి! డాక్టరుగారు వచ్చారు చూడండి. డాక్టరుగారూ! ఈ 'సనాతనబాబు'గారే నన్ను మీవగ్గరికి పంపిం చాడు. మీ కిద్దరికీ పూర్వపరిచయ మనుకుంటాను" అన్నాడు.

అసలు మా ఇద్దరికీ పరిచయమనేది లేదు. అయినప్పటికీ "అప్పనవును—" అంటూ సనాతనబాబుకు నమస్కరించాను.

"వీరి బావమరిది స్థితి ఎలా వుందండీ డాక్టరుగారూ?— ఏరకమైన జబ్బో తేలిందా?" అని సనాతనబాబు అడిగాడు.

అసలు ఏరకమైనజ్వరమో నాకే తెలియలేదు. షుమా రుగా మలేరియాజ్వరానికి మందు రాసిచ్చాను. నాకూ, రోగికీ అదృష్టం బావున్నట్లయితే - ఈ మందుతో లేచి తిరగ్గలడు.

ఐనా రోగి కుటుంబం ముందు నిజం చెప్పలేక పోయాను. గంద్రగోళంతో తెలిసీ తెలియని విషయాలు చెప్పడంలో గౌరవం వుండదు. ఆ కారణంతో కొంచెం సేపు ఆలోచించి "టైఫాయిడ్ లక్షణాలు కనిపిస్తున్నాయ్; ఐనప్పటికీ ప్రస్తుతం "క్వైను"

మొదలు పెట్టాను. రెండు మూడు రోజులపాటు చూడాలి" అన్నాను.

సనాతనబాబు పూర్వకాలపు మనిషి! ఒక విధంగా వొదిలే వాడు కాడు. "అయితే నిజంగా మీరు రోగమేమిటో నిర్ధారణ చేయలేరా?" అని అడిగాడు

"ఒక రోజుకూడా గడపలేదు ఏ జబ్బో ఏమిటో ఎలా చెప్పగలమండీ? అంతగా కావాలంటే రక్తాన్ని పరీక్షించినట్లయితే చెప్పొచ్చు."

"ఇది పరీక్షించాలి, అది పరీక్షించాలి అనేది మీ కిప్పుడు ఒక ఫ్యాషన్ అయిపోయింది లెండి కానీ, మా కాలంలోని డాక్టర్లిదేమీ చేయరు. మా హేమంత డాక్టరుగారు " అని పెద్ద లెక్చరొకటి దంచాడు.

ఆ లెక్చరులో హేమంతబాబు నాడి చూసి కడుపులో కురుపులున్న సంగతీ మొదలైనవి తెలుసుకునేవాడు డాక్టర్ రమేష్ ఫొటో చూసి జ్వరమున్నదీ లేనిదీ చెప్పేవాడు డాక్టర్ విశ్వంబర్.. కవిరాజు . ..హరికిశోర్ కాంపౌండర్,—వీళ్ళంతా చికిత్సా శాస్త్రంలో అద్వితీయులని, మహా గొప్పవారనీ అన్నాడు.

అంతా విన్నాక నవ్వి "మీరు చెప్పింది నిజమే! మేము వాళ్ళకు సమానులంకాము. అంత చదువు మేము చదువుకో లేదు." అన్నాను.

ఆమాటకు 'సనాతనబాబు' అనే టైటిల్ సంపాదించుకున్న ప్రసన్నబాబు సంతోషించి "అవును ఆ కాలమే వేరు. మా చిన్నతనంలో ఎంతో తిండి తినేవాళ్ళం! కడుపునిండా తిన్నాక నేను రెండువేర్ల రసగుల్లాలు, మామిడిపండ్లూ తినేవాణ్ణి! అంత

దూరం చేనికి? మీరు మేకను వండించుకొని తినగలరా?" అన్నాడు.

"లేదు, అటువంటి సామర్థ్యం నాలో లేదు."

"అటువంటప్పుడు ......."

ఈ 'అటువంటప్పుడు' అనేదానికి నే నేమని జవాబు చెప్పను? ఆలోచిస్తుండగా 'సనాతనబాబు' చొక్కా విప్పి, పిడికిలి బిగబట్టి, చేయి పైకెత్తి "నావేపుచూడండి—" అనిఅన్నాడు.

అతనివేపు చూసాను. ఛాతీ, చేతుల కండరాలు బలిసి మెలితిరిగి వున్నయ్. దాదాపు అరవై సంవత్సరాల వయసుంటుంది. ఇంతవయసులో కూడా, ఆ శరీరం ఇంత బలంగా వుండడం నిజంగా ఆలోచించవలసిన విషయమే!

"కొంచెం నా నాడి పరీక్ష చేస్తారా?" అని అడిగాడు.

ఆయన నాడి చూసాను. రక్తపుపోటు వున్నట్లుంది. ఆ సంగతే మర్మంలేకుండా చెప్పాను. ఆయన నవ్వి "రక్తపు పోటనేది డాక్టర్లకు చాలా తేలికమాటగా మారిపోయింది. ఏం తెలిసినా, తెలియకపోయినా ఆమాటని ఒక ఫ్యాషన్‌లాగా వాడుతున్నారు." అన్నాడు.

నేనేమీ మాట్లాడలేకపోయాను. ప్రాణకృష్ణబాబు ఆయన్ని ఒకవేపుకు తీసుకొనివెళ్ళి ఏదో చెప్పాడు. ఆమాటలఅర్థమేమిటో గాని సనాతనబాబుకూడా ఆ డాబావేపు చూసి, మీసాలచాటున నవ్వుకుని "అదా సంగతి! సరే. ఈ రోజుల్లోని ఆడపిల్ల చేయలేని పనేముందిలే!" అన్నాడు.

వయసు గడిచిపోతున్న ప్రాణకృష్ణబాబుమాత్రం పిచ్చివాడా ఏమిటి?

ఫీజు తీసుకొని ఇంటికితిరిగి వచ్చేసాను.

అంతా పడుకున్నారు. రాత్రి ఎంత పొద్దుపోయిందో తెలియదు గడియారం ఆగిపోయింది.

"డాక్టరుగారూ?"

తొట్రుపడుతూ బైటికి వచ్చేప్పటికి చేతిలైటుతో ఒక మనిషి గుమ్మంముందు నిలుచుని వుండడం కనిపించింది

"ఏం కావాలోయ్?"

"శ్రమఅని అనుకోకుండా దయవుంచి ఒకసారి సనాతన బాబుగారింటికి రావాలండి?"

"ఎందుకేమిటి?"

"ఆయనగారు దొడ్లోకి వెళ్లి తిరిగి వచ్చినప్పట్నుంచి స్మృతిలేకుండా పడిపోయాడు బాబూ"

తప్పనిసరిగా ఆయన ఇంటికి వెళ్లాను. సనాతనబాబు ఆపాదమస్తకం దుప్పటి కప్పుకొని పడుకుని వున్నారు భార్య వల దగ్గర కూచుని, విచారంగా విసనకర్రతో విసురుతూవుంది

"సనాతనబాబూ, ఓ సనాతనబాబూ?" అని పిలిచాను.

జవాబు లేదు.

"సనాతనబాబూ మీ చేయి కొంచెం ఇటు చాపండి"

జవాబు లేదు.

దుప్పటి లాగివేసాను. సనాతనబాబు చనిపోయి వున్నాడు

ఆ శరీరంలోని ప్రతి అంగంకూడా ధృడంగానే వుంది. కండరాలు మెరుస్తూనే వున్నయ్ కేవలం ప్రాణం మాత్రం లేదు బహుశా పక్షవాతం వల్ల చనిపోయి వుండొచ్చు!

విచారంతో ఒంటరిగా తిరిగి వస్తున్నాను. ఆ వగ్గర్లోవున్న చీకటిసందులోంచి "డాక్టరుగారా ఏమిటి? డాక్టరుగారూ?" అని పిలవడం వినిపించింది.

"ఎవరది?"

ఆ సందులోంచి ప్రాణకృష్ణబాబు రావడం చూశాను. నా దగ్గరికివచ్చి మీ టార్చిని కొంచెం యిస్తారా?" అని అడిగాడు.

"ఎందుకేమిటి?—"

"ఇవాళసాయంకాలం ఆ అమ్మాయి ఒక కాగితం విసిరి వేసింది. అనొకవేళ ప్రేమరేఖ అయివుంటుందేమో?"

ఆ సందు ప్రాణకృష్ణబాబు ఇంటికీ, ఆ అమ్మాయి ఇంటికీ మధ్యనవుంది. నా కూ్కూడా కుతూహలం కలిగి టార్చి తీసుకొని ఆ సందులోకి వెళ్ళాను.

ఆ సందు మహాఇరుకు! ప్రపంచంలోని చెత్తా చెదారమూ, కుళ్ళుకంపు యావత్తు అక్కడేవున్నట్లుంది. టార్చివేశాను. ఒక కాగితపుండ పెంటకుప్పమీద పడివుంది. ప్రాణకృష్ణబాబు వొంగి ఆ కాగితాన్ని తీసుకుని, విప్పిచూశాడు. అందులో కొన్ని వెంట్రుకలు వున్నయ్!

ఆ అమ్మాయి తలదువ్వుకొని వూడిపోయిన వెంట్రుకల్ని పొట్లంగా కాగితంలో చుట్టి పారవేసివుంటుంది.

"చూస్తున్నారా డాక్టరుగారూ?"

" ఆ చూస్తూనే వున్నాను. మరి ఉత్తరం ఏది? ఇందులో వెంట్రుకలు వున్నయ్. పారవేయండి"

"డాక్టరుగారు నిజంగా రసికులుకారు, ప్రియురాండ్రు తమప్రియులకు వెంట్రుకలు బహుమానంగా పంపిస్తారని మీకు

ఇంగ్లీషు నవలల్లో చదవలేదా? ఇది కూడా అటువంటి బహుమాన చిహ్నమండీ!"

తీక్షణంగా ఒకసారి ప్రాణకృష్ణబాబు చూపుల్లోకి చూసాను. అతనిచూపులు పిచ్చివాడి చూపుల్లా వున్నాయ్.

నిజంగా ఇతను పిచ్చివాడే!

ఇంట్లో ఒక మనిషి ప్రాణాపాయంలో వున్నపుడు, ఈయన ఇంతవయసులోకూడా అర్ధరాత్రి ప్రేమోపహారాన్ని వెదకుతూ వున్నాడు. ఇటువంటి పిచ్చివాడివిషయం ఒకసారి ఏదో నవలలో చదివిన జ్ఞాపకంవచ్చింది. ఒక వేసు కంట్లతో చూసాను. ఆ మనిషి "అయిదవజార్జి చక్రవర్తి తనదగ్గర అప్పుతీసుకున్నాడనీ, జార్జి చక్రవర్తి ఆ అప్పుసు తీర్చకూడదని నిశ్చయించుకున్నాడనీ" అంటుంటాడు. అన్నిపనులూ జాగ్రతగా చేసుకుంటాడు. ఈ విషయంలోనే ఆయనకి పిచ్చి' ప్రాణకృష్ణబాబుకూడా బహుశా అలానే ఆడపిల్లలు తనను చూడడంతోనే ప్రేమిస్తున్నారని భ్రమపడుతున్నాడేమో!

"మీ బాపమరిదికి ఎలావుంది?" అని నే నడిగాను.

వెంట్రుకల పొట్లాన్ని జేబులో పెట్టుకొని "రాత్రింబవళ్లు ఇరవైనాలుగ్గంటలూ ఈ అప్సరసకోసం తిరుగుతూ వున్నాను. వూపిరి పీల్చుకొనేందుకే నాకు సమయం దొరకనప్పుడు వాడి మంచి చెడ్డల్ని చూసేంత టైంకూడా వుండడంలేదంటే మీరు నమ్మరు. నాలుగైదుసార్లు ఆ పిల్ల డాబామీదికి వస్తుంది. పది సార్లు కిటికీలోంచి తొంగిచూస్తుంది. ఇంకేం చెప్పమంటారు; దాంతో నా అవయవాలన్నీ." ఆయన ఇంకా ఏదో చెప్ప బోయాడు.

"సరే, ఇక ఇంటికి వెళ్ళండి?" అన్నాను.

మాట్లాడకుండా నావేపు తమాషాగాచూసి వెళ్ళిపోయాడు.

ఇంటికి వచ్చి మంచంమీద పడుకుని ప్రాణకృష్ణ బాబు పిచ్చివాడేమోనని ఆలోచిస్తున్నాను. నా కేమీ అతని పరిస్థితి అంతుపట్టడంలేదు. సరి నే నేమంత తప్పుపవాణ్నీ! ఎవరి నవ్వునూ, సిగ్గునూ ఆదారంగాతీసుకొని గాలిమేడలు కడుతూ వున్నానో, ఆమె నన్ను గడ్డిపూచంతగా కూడా కోరడంలేదేమో! ఆ డాబామీది పిల్లమాదిరిగానే, 'ఆమె' కూడా నా మీద ఉదాసీనంగా వుందేమో! నేనుకూడా ప్రాణకృష్ణబాబుమాదిరిగా సంకీర్ణమైన చీకటితోకూడిన మురికి వీధుల్లో తిరుగుతూ వున్నానేమో!

వర్షం వచ్చింది. ఉదయం లేచి చూసేప్పటికి మేఘాలు తిరుగుతూవున్నాయ్. ఎడతెరిపిలేకుండా వర్షం కురుస్తూనే వుంది. మేఘాలు గర్జిస్తూనే వున్నయ్! అటువేపు పొగడచెట్టు వుంది. అసంఖ్యాకమైన పూలు చెట్టునిండా వికసించి వున్నయ్.

ఇవాళ ఏమీ పనిలేదు. మంచంమీద పడుకునే వర్షపు చినుకుల్ని చూస్తున్నాను.

"ఆషాడస్య-ప్రధమ దివసే' అనేది గుర్తుకు వస్తూంది. కానీ, ఇవాళ తృతీయం—'

"డాక్టరుగారూ?"

"లోపలికిరా"

టెలిగ్రాం ప్యూను లోపలికి వచ్చాడు. సంతకంచేసి పంపించి, టెలిగ్రాం విప్పి చదివాను.

"తొందరగా బయలుదేరండి. నాగేంద్రుడు జబ్బుగా వున్నాడు.'

నా కవిత్వం ఆగిపోయింది నాగేంద్రుని విషయం అలో చిస్తున్నాను ఆయన బిహారి బ్రాహ్మణుడు పైగా నాకు ముఖ్య స్నేహితుడు. ఫీజుకూడా ఇస్తుంటాడు మొదట్లో పడ్డనేవాణ్ణి. చిన్నబుచ్చుకని "ఇది మీ వ్యాపారం! ఫీజు ఇచ్చే సామర్థ్యం నాకుంది. పైగా నేను స్నేహితుడిని కాబట్టి తప్పకుండా ఫీజు పుచ్చుకుని తీరాలి. ఏ రోజునైతే ఫీజు ఇవ్వలేని సామర్థ్యం నాకు వుండదో, ఆనాడు నువ్వు వూరికినే నాకు మందును యిస్తు వుతే " అని అంటూండేవాడు

నాగేంద్రుడు 'మోతీహారం'లో వుంటూండేవాడు రైలును లోవెళ్లాలి. మూడుచోట్ల బండి మారాలి అందులో ఎడతెరిపిలేని వర్షం కురుస్తూవు ది నాగేంద్రుడేమో జబ్బుగా వున్నాడు. వెళ్ళక తప్పదు.

ఆ వర్షంలోనే స్టేషనుకి బయలుదేరాను. గుర్రబ్బండి ముందుకు వెళ్ళలేక పోతూవుంది. దారంతా బురదమయం. బండి వాడు గుర్రాన్ని కొరడాతో కొడుతున్నాడు. దాని నడకలో ఏ మాత్రం కూడా మార్పు రాలేదు;

ఛళ్లుమని వినిపించింది.

"ఏందుకలా కొడతావోయ్?"

"బండి దొరకదు బాబుగారూ!"

"అవునోయ్—"

గడియారం చూసాను. బండికి ఇంకా ఇరవై అయిదు నిమిషాల పైముంది. మైలున్నర వెళ్లాలి. టిక్కెట్ కూడా కొనాలి!

'ఛల్—ఛల్'మని కొరడా దెబ్బలు వినిపించాయి. కొంత దూరం వెళ్లాక కొంచెం మెరక ఎక్కవలసి వచ్చింది. బండి

మెరక ఎక్కుతున్నప్పుడు, ఎవరో మనిషి దారిని దాటుతూ కాలు జారి బండికిందకు దొర్లుకువచ్చాడు.

"బండిని ఆపవోయ్. ఎవరో బండికింద పడ్డారు."

ఒక గడియలో బండివాడు బురదతో మునిగిపోయిన ఒక మనిషిని తీసుక వచ్చాడు. పై పెదిమ పగిలింది. పెదమనుంచి రక్తం కారుతూవుంది.

"ఎవరూ—? అరే ప్రాణకృష్ణబాబా! ఈ వర్షంలో ఎక్కడికి వెళ్తున్నారు. రాండి. లోపలికి వచ్చి కూచోండి. ఎక్కడికి వెళ్తున్నారేం?"

ఆయన ఆయాసపడుతూ "ఇక్కడికే. కొంచెం స్టేషన్ దాకా వెళ్ళొద్దామని బయలుదేరాను. ఆ అమ్మాయి ఈ బండికి అత్తవారింటికి వెళ్తావుంది. వీడుకోలు ఇద్దామని ఆః! ఆఖరి దర్శనం మరిచిపోలేనిదిగా హృదయంలో హత్తుకుపోతుందిసుమా." అని నవ్వాడు.

పగిలిన పెదిమనించి రక్తం కారుతూనే వుంది. చివరకి మేమంతా స్టేషనుకి చేరుకున్నాము. టికెట్ కొనుక్కుని, బండ్లో కూచునిఒక్కసారి బైటకు చూసాను. ఎడతెరిపిలేని ఆ వర్షంలో ప్రాణకృష్ణబాబు ప్లాటుఫారంమీద, ఆవేపునుంచి ఈ వేపుకు పరుగెత్తుతూ ప్రతి బండ్లోకి చూస్తున్నాడు. ఆయన వెతికే మనిషి ఎక్కడుంది? ఆ సౌమ్యముఖం ఎక్కడుంది?

తిరిగి తిరిగి ఆఖరికి ఆడవాళ్ళ పెట్టె దగ్గరకు వచ్చి హాండిల్ పట్టుకున్నాడు. వలుపు తెరిపేందుకు సిద్ధంగా వున్నట్లు ఆ వాలకం కనబడుతూవుంది. ఎవరో రైల్వే వుద్యోగి వెనక

నుంచి ఆయన్ను పట్టుకుని ఒక తోపు తోసి 'ఇది ఆడవాళ్ళ పెట్టెఅని తెలియదూ? దిగు బండి కదులుతూవుంది" అన్నాడు.

బండి మెల్లిమెల్లిగా కదిలింది.

ప్రాణకృష్ణబాబు మూర్ఛుడిలా నిలుచునిపోయాడు. ఆయన కళ్ళల్లో పిచ్చివాడి ఛాయాలు కనిపిస్తున్నాయ్. వొంటినిండా బురద! పగిలిన పెదిమనుంచి రక్తం కారుతూనేవుంది. గాలిని తుచ్ఛంగా పరిగణించి రైలుబండి ఇనపబద్దెలమీద పరుగిడుతూవుంది

పొలాన్ని, ఆడవుల్నీ, నదుల్నీ, పర్వతాల్నీ వెనక్కి నెట్టుకుంటూ బండి వాయువేగంతో పోతూంది పెట్టెలో నే నొక్కణ్నే!— వొంటరిగా కూచుని ప్రాణకృష్ణబాబు సంగతి ఆలోచిస్తున్నాను; రానురాను మానవజాతి ఎంత కిందికి దిగజారి పోతోంది!

నాలుగువేపులా వర్షం కురుస్తూనేవుంది వర్షాన్నీ, గాలినీ లెక్కచేయకుండానే రైలు పోతూవుంది. వొంటరిగా కూచుని నేనుఆలోచిస్తున్నాను—'ఆమె' ఏనాడుకూడా నాతో 'నేను నిన్ను ప్రేమిస్తున్నాను' అని ఎప్పుడూ చెప్పలేదు. నేనెప్పుడన్నా దగ్గ రికివెళ్తే 'ఆమె' దూరంగా పోతూవుంటుంది. నన్నెప్పుడూ 'ఆమె' ఉపేక్షిస్తూనే వుంది భయంకరమైన దొంగవాణ్ణని నన్ననుకుం దేమో!—నిజంగా నేను దొంగనైతే, ఎలాగైనా ఆమెను బల వంతంగా ఎత్తుకవచ్చేవాణ్ని' కానీ, నేను సభ్యతా ప్రపంచంలోని మనిషిని! ఇటువంటి విషయాలు, వేషాలు నా కసలు గిట్టవు

పృథ్వీరాజు ఎక్కడున్నాడో—?

సంయుక్త ఎక్కడుందో—?

"నీ మూసిన కవాటముపై తల పగుల కొట్టుకోనా..

ప్రాణాల్లో కొత్తబలం, ప్రణయంలో దృఢవాణి
హృదయంలో ఆవేశం, ఉబికినాయి నా లోపల
తలుపు తెరువు నా రాణీ!
సర్వ్వరమే తెరువు రాణీ.
ఆపలేను ఈ తపనను; ఆగలేను నేనింక
చెబితే 'లేవని' చెప్పు; లేదా కౌగిలించు
తలుపు తెరుపు నారాణీ!"

ఒక క్రమం లేకుండానే ఏమిటేమిటో అందామనిపిస్తుంది. అరుద్దామని బుద్ధి పుడుతున్నా అరవలేకపోయాను. ఈ విగ్రహమే నా జీవితానికి అన్నిటికంటే గొప్పదైనాడెడి.

నాగేంద్రుడి ఇల్లు చేరేప్పటికి ఏడుపులూ, మొత్తుకోళ్ళతో నిండిపోయింది. చిన్న వసారాలో పెద్ద ఆవొకటి పడుకునివుంది. ఆవు వీపుమీద సన్నని తివాచీ పరిచుంది. రోగి ఆవుతోక పట్టుకున్నట్లయితే—గోదానమంత పుణ్యం వస్తుందనీ, మృత్యువుతో ఆఖరిపోరాటం సాగించే రోగి ఈ పని చేయలేకపోయినప్పుడు ఆరోగి వైతరిణీ నదిని దాటలేడనీ, ఇక్కడ ప్రజల్లో పెద్ద నమ్మకమొకటుంది. ఐతే—నాగేంద్రుడు ఆఖరి ఘడియల్లో వున్నాడా?

ఆపు నెలాగో తప్పించుకుని నాగేంద్రుని చూసాను. చాలా నీరసంతోవుండి, జ్వరంతో బాధపడుతూవున్నాడు. రోగికి కావలసిన మందిచ్చి, బైటికి వచ్చి, కాళ్ళూ చేతులూ కడుక్కొని పడుకునేందుకు తయారౌతూవుండగా- పెద్ద వలపాగా చుట్టుకున్న మనిషొకాయన నాముందుకువచ్చి కూర్చున్నాడు. వొళ్ళంతా ఎర్రగావుంది. గడ్డం, మీసాలు నున్నగా వున్నయ్. కళ్ళల్లో

జ్యోతులు వెలుగుతున్నయ్. నొసట ఎర్రని బొట్టువుంది. మనిషి కొంచెం బుద్ధిమంతుడిలా వున్నాడు

ఆయన వీళ్ళ గురువుగారట! నాగేంద్రుడు జబ్బుసంగతివిని అతన్ని చూసేందుకు వచ్చాడు. ఆ చుట్టుపక్కల జ్యోతిష్యములో ఆయనకు మంచిపేరు ప్రఖ్యాతులున్నయ్. నాగేంద్రుడి జన్మపత్రం తెప్పించి, గుణించి ఈ రాత్రి పన్నెండు గంటలవరకూ మీరు నాగేంద్రుణ్ని ఏదోవిధంగా పూపిరితో వుంచగలిగివుట్లయితే, ఆతరవాత అతడికేమీ భయంలేదు ఈ కొన్నిగంటలసేపే అతడికి మహాభయంకరమైనవి డాక్టరు గారూ, పన్నెండు గంటలవరకూ అతణ్ని రక్షించే కారం మీ మిచ్చే పెడుతున్నాను. ఆ తరవాత నేనుకూడా చేయవలసిందేదో మొదలుపెట్టబోతున్నాను అని నాతో అన్నాడు

నల్లని చీకటిరాత్రి! ఎన్నిగంటలవుతుందో తెలీదు. ఆకాశంలో నాలుగు వేపులా మేఘాలు అలుముకొనేవున్నాయ్ ఎడతెరిపిలేనివర్షం. మధ్య అప్పుడప్పుడు వురుములు వినపడుతూ వున్నయ్.

నాగేంద్రుడి మంచందగ్గర కూచుని అతనికి మెల్లిమెల్లిగా బ్రాందీని, కొద్దికొద్దిగా యిచ్చాను.

"పులేశ్వరీ—పులేశ్వరీ" నాగేంద్రుడు ప్రలాపించాడు

పులేశ్వరి అతడి మొదటి భార్య! ఆమె చనిపోయి చాలా కాలమైంది. రెండోభార్య దగ్గర కూచుని అతడి సేవలో నిమగ్నురాలై, మరిచిపోయున్నా తన పేరును—భర్త ఉచ్చరిస్తాడో లేదో అని కనిపెట్టుకొచ్చుంది.

మాటిమాటికీ అదే పిలుపు "పులేశ్వరీ పులేశ్వరీ" అని.

ఆ పక్కగదిలోనించి కులగురువుగారు తన శక్తినంతటినీ ఏకంచేసి—దుష్టగ్రహానికి శాంతి చేస్తున్నాడు. పవిత్రమైన హోమాగ్నిగుండంలోని పొగ ఇక్కడికి కూడా వస్తూవుంది. మధ్య మధ్య హోమగుండంలోంచి 'గప్' మంటూ వెలుతురు వస్తూవుంది.

గడియ గడియకూ నేను నాగేంద్రుడికి బ్రాందీ ఇస్తూనే వున్నాను. మధ్యలో అతను 'పరమేశ్వరి' అని కలవరిస్తూనే వున్నాడు. రెండోభార్య మాటిమాటికీ కన్నీళ్ళు పైటకొంగులో తుడుచుకొంటూనే వుంది.

బైట మేఘాలు, పురుములు, వర్షం.

హఠాత్తుగా అన్నీ ఆగిపోయినయ్. మేఘాల గర్జనలు తగ్గినయ్. ప్రకృతి శాంతించింది. ఆ సమయంలోనే నాగేంద్రుడు కళ్లు తెరచి నా ముఖంవేపు చూసి మెల్లిగా "ఎప్పుడొచ్చావు?" అని అడిగాడు.

ఆ తరవాత భార్యవేపుచూసి "కమలా! కొంచెం నా తల గడదింపు సరిచేయి' అన్నాడు.

భార్య కృతార్థురాలైంది!

కులగురువు "ఎన్నిగంటలయిందో చూడండి." అని అనడం వినిపించింది.

నా గడియారాన్ని చూసాను. 'పన్నెండు పదినిమిషాలు!'

నాగేంద్రుడు బ్రతికాడు

నాగేంద్రుడు కోలుకున్నాడు. ప్రాణకృష్ణబాబు బావమరిది ఆరోగ్యవంతుడై తన పిచ్చిమామను తీసుకుని ఎక్కడికో వెళ్ళిపోయాడు.

నా ప్రాక్టీసు మునుపటికంటే ఎక్కువయింది దాంతో పాటు నాలోని '<u>దాహం</u>' కూడా ఎక్కువైంది

బైటికి నేను సభ్యతా మానవుణ్ణే! కానీ, నాహృదయంలో బర్బరత్వం దాగా పాతుకునిపోయింది. మొదటియుగం తాలూకు మానవుడు క్షణ క్షణానికీ, సంపూర్ణమైన సభ్యతా మానవుణ్ణి లోబరుచుకొని, బైటికిసట్టి—సీరికి తిలోదకా లిప్పించి తన వాస్తవిక రూపాన్ని నాద్వారా బైట పెట్టించుదు ప్రయత్నిస్తు న్నాడు. నీతిశాస్త్రంలోని ఉపదేశాలు అతని వెరిరెక్కడంలేదు. కానీ—ఎప్పుడో ఒకప్పుడు ఈ సభ్యతా వేషాన్ని వొదిలి, పసు పులా వివస్త్రుడనై—నన్ని సమాజ మధ్యంలో తిప్పుతుందా యేం?

నా మనసులోని ఈ అశాంతినీ, ద్వంద్వాన్నీ, నన్నూ చూసి—ఎవరైనా అనుమానించేందుకు అస్కారముందా?—

"డాక్టరుగారూ—?"

"రాండి రాండి, నమస్కారం, కూర్చోండి "

"కూర్చునేంత వ్యవధి లేదండి. తమ రిప్పుడే నాతోపాటు 'రాంగంజి'కి—బయల్దేరాలి. అక్కడ కలరా పుట్టుకుంది"

"సరే పదండి—"

3

"నీకు నామీద ప్రేమ వున్నదా—లేదా?"

జవాబులేదు.

"చెప్పవేం?—"

జవాబులేదు.

"చెప్పవా?——"

"ఏమనిచెప్పను"

"నన్ను ప్రేమిస్తున్నావా—లేదా?"

"నాకు తెలీదు." అని 'ఆమె' వెళ్ళిపోయింది.

మూర్ఖుడిలాగ చూచుని చూస్తున్నాను. 'ఆమె' నన్ను నిజంగా ప్రేమించడంలేదా?— హృదయంమటుకు ఈ సంగతిని ఒప్పుకోపడంలేదు.

"హృదయంలో జ్వాలని వెలిగించీ
మధురాతి మధుర ప్రేమను కలిగించీ
నా కోరిక నెందుకు త్రోస్తావు
నాకెందుకు బాధను యిస్తావు."

'ఆమె' తిరిగివచ్చి నా వెనక నిలుచున్నట్లుంది. నేను తిరిగి ఆమెను చూడలేను. రాసుకుంటూనే వున్నాను. ఆమె చీర చెంగు నా వీపుకు తగులుతూన్నట్లుంది. ఆమె ముఖం సిగ్గుతో ఎరుపెక్కినట్లుంది. ఆవేశంతో పెదిమలు వణకుతున్నట్లున్నయ్.

"చూపులతో పడు యమయాతన
నా హృదయములో ఆవేదన
బాధపడే దీనుణ్ణి
మరిచావా ప్రేయసి
మరిచావా నా రాణీ!"

'ఆమె' ఇంకా దగ్గరికి వచ్చింది. నేను ముఖం మాత్రం తిప్పలేను. నాలో ఆత్మాభిమానం లేదా? కేవలం అనునయ విన యాలు తప్ప, నా కవిత్వంలో ఆ అభిమానం ఎప్పుడూ అంకితం కాలేదనుకుంటాను.

'ఆమె' నా వెనకనించి వంగి, రాసుకుంటున్న నా కవిత్వాన్ని చదువుతూవుంది. నేను తలతిప్పాను. 'ఆమె' కనబడలేదు.

"నువ్వెవ్వరివి?—"

నా ముందెవరో ఒక అపరిచిత భయపడుతూ నిలుచుని వుంది. చేతులెత్తి నా మాటకి "బాబుగారూ! చాలా ఆపదలో వున్నాను బాబూ! మీరు దయామయులని విని...." మిగతా మాటలు బైటికి రాలేకపోయినయ్.

"పగలు రావడానికి నీకు తీరుబడి కలగలేదా?"

"పగలు తమరు పనుల్లో నిమగ్నులై వుంటారని, తీరుబడి వుండదని... "

"నీకు జబ్బేమిటి?—"

ఆమె మాట్లాడలేదు. ఆమె వంటినిండా పెద్దపెద్ద మచ్చలు వున్నయ్! ముక్కు కొంచెం వాచివుంది. పెదిమల అంచున కూడా మచ్చలు వున్నయ్. కండ్లు ఎఱ్ఱగా వున్నయ్ కొంపతీసి ఈమెకు కుష్టువ్యాధి కాదుకదా?

"ఇలా నీవొంట్లో ఎంతకాలంనించి వుంటూవుంది?"

"రెండు నెలలయిందండి . ."

"ఇంజక్షనులు పుచ్చుకోవాలి. డబ్బు ఖర్చుపెట్టాలి"

"నేను చాల బీదదాన్నండి. నామీద దయచూపించండి .. భగవంతుడు మీకు మేలుచేస్తాడు"

"భగవంతుడు వొప్పుకున్నాడా?"

నా వుద్దేశ్యం గ్రహించి నట్లుంది. "నాకు—నాకు నయం చేయండి బాబూ! రక్షించండి—రక్షించండి." అనిఅంటూ చేతులు చాచి నా రెండుకాళ్లు పట్టుకుని ఏడ్చింది.

ఏదో విధంగా కాళ్లు విడిపించుకున్నాను. "సరే - నాకు ఫీజు ఇవ్వొద్దు. మందు ఖరీదైనా ఇస్తావా?" అన్నాను.

"నా దగ్గరేమీ లేదు బాబూ. తమవంటి దయామ...."

"నోరుముయ్—"

చీటి రాసి, దాంతోపాటు ఒక రూపాయకూడా ఇచ్చి "ముఫ్ఫైరెండు మాత్రలు యిస్తాడు. ఇక నా దగ్గరకు రానవసరములేదు. ఈ మందుతో నీ జబ్బు నయమవుతుంది" అన్నాను.

ఆమె నమస్కరించి వెళ్లిపోయింది.

ఏమాత్రమన్నా ఆమె నాకు డబ్బు ఇచ్చినట్లయితే—ఇంత అశ్రద్ధ చేసేవాణ్నికాదు. ఏమీ ఆలోచించకుండానే వేడిని తగ్గించే మందు రాసిచ్చాను. ఈవిధంగా నడవడం నా జీవితానికి మంచిదేనా?—

# 4

"క్షమించాలి హరీష్‌బాబూ! ఈపని నాతో కాదు."

అతనే మా పొరుగింటి హరీష్‌బాబు వచ్చాడు. ఏదో దుకాణంలో గుమాస్తాగా వుంటూ, ఒక ఇన్‌ష్యూరెన్సు కంపెనీకి ఏజెంటుగా వుంటున్నాడు. నే నా కంపెనీకి డాక్టరుగా వ్యవహరిస్తున్నాను. ఆకారణంతోనే ఒక్క మనిషిని భీమా చేయించేందుకు నా దగ్గరకు తీసుకొని వచ్చాడు. మనిషిమాత్రం పైకి లావుగా కనిపిస్తున్నాడు. అతనికి మధుమేహం వుంది; హృదయం చాలా దుర్బలంగా వుంది. అతని విషయంలో మంచి రిపోర్టు వ్రాయమని హరీష్‌బాబు నన్ను బతిమిలాడుతున్నాడు. ఆరోగ్యం సరిగా

లేనట్లయితే 'కంపెనీవారు అతడి భీమాని ఒప్పుకోరు. అందు కనే నేను పై మాటల్ని హరీష్‌బాబుతో అన్నాను. పగలును రాత్రిగానూ, రాత్రిని పగలుగా చెప్పడం నాకు విరుద్ధం!

"ఎంతో ప్రాధేయపడి—బతిమిలాడి ఆయన్ను భీమా చేయించేందుకు ఒప్పించాను. నా కష్టాన్ని, శ్రమనీ మీరు రెండు నిమిషాల్లో తేల్చివేశారు! మీకు నా పరిస్థితి తెలియంది కాదు. నెలరోజుల్నుంచి పిల్లవాడు మంచం పట్టాడు. మందుకని, మాకు కని, పథ్యాలకని నా నడుములు విరిగిపోతున్నయ్! ఈ మనిషితో భీమా చేయించినట్లయితే నాకు నాలుగు డబ్బులు గిట్టుబాటవు తయ్. ఆలోచించండి" అని హరీష్‌బాబు మళ్ళీ అన్నాడు.

"ఐనప్పటికీ ఈపనిమాత్రం నాచేతకాదు హరీష్‌బాబు. క్షమించండి."

"క్షమాపణ నేను కోరుకోవాలి డాక్టరుగారూ! అదృష్ట మనేది నా కెప్పుడూ ఎదురు తిరుగుతూనే వుంది. పోనియ్యండి .. మా అబ్బాయికి నయమవుతుందో లేదో చెప్పండి—"

"అది టైఫాయిడ్ జబ్బు!"

"నా పిల్లవాడి పరిస్థితి తెలిసుండికూడా మీరు నాకు సహాయం చేయలేరా—?"

"క్షమించండి—"

హరీష్‌బాబు కొంచెంసేపు వూరుకొని ఆతరవాత "సరే! మా అబ్బాయికి మందు రాసివ్వండి" అని అడిగాడు.

"విటమిన్ డి—"

హరీష్‌బాబు నా చేతులు రెండూ పట్టుకుని "డాక్టరుగారూ

నేను ప్రతి దమ్మిడీకి గడ్డి కరవాలి....తమ రేవిధంగా నైనా ఈ కేసుని—" అని అన్నాడు.

"ఐతే ఒకపని చేయండి. ఈ పదిరూపాయలు........"

నామాట పూర్తికాకముందే ఆయన నాచేతులు వొదిలి పెట్టి "తమ రిలా నన్నవమానపరుస్తారా? ఈనాడు నా అదృష్టం ఇలా వుండి బికారినయాను. పూర్వం ఈ వూరికి చుట్టుపక్కల ఇరవై అయిదు మైళ్ళ దూరం వరకూ మా గొప్పతనాన్ని గురించి పొగుడుకునే వంశంలో పుట్టాను. 'రతన్‌గంజ్' బ్రాహ్మణుల పేరు అందరికీ తెలుసు. ప్రతిరోజూ మా పెరట్లో రెండువందల మంది భోజనం చేయడంకూడా చూసాను. అటువంటి వంశం లోనివాడికి ఈనాడు మీరు పదిరూపాయలు దానం చేయాలని చూస్తున్నారు.....మీకు—" హరీష్‌బాబు చెప్పలేకపోయాడు. గొంతు బొంగుపోయింది. కళ్ళు చెమ్మగిల్లినయ్.

నేను నిశ్చలంగా రాతిబొమ్మలా నిలుచున్నాను. హరీష్ బాబు వెళ్తూ "నమస్కారమండి. వస్తాను" అంటూ వెళ్ళి పోయాడు.

ఆ సాయంకాలం వాళ్ళ పిల్లవాణ్ని చూద్దామని వాళ్లింటికి వెళ్ళాను. హరీష్‌బాబు ఇంట్లో లేడు. ఆయన భార్య "ఇది టైఫా యిడ్ జ్వరమని మీరు ఆయనగారికి చెప్పారట. కానీ, పిల్లవా డేదో కలవరిస్తూ, మధ్యమధ్య త్రుళ్ళిపడుతూవుంటాడు."అన్నది.

టైఫాయిడ్‌లో అలానే వుంటూంటుంది.

"అయినా—ఒకనాడు మీ యింటిదగ్గర ఎవరో పిచ్చిది పిల్లవాణ్ని పట్టుకుందట. అదేమన్నా పిల్లవాడికి మంత్రం పెట్ట లేదుకదా?"

"లేదు లేదు. అటువంటిదేమీ జరగలేదు."

నేనేమీ జవాబు చెప్పలేదు. క్షణంసేపు వూరుకొని "ఈ మందును జాగ్రత్తగా వాడండి; విటమిన్ డి! ప్రతిరోజు పది పన్నెండు చుక్కలు పాలల్లో కలిపి ఇవ్వండి" అన్నాను.

"మరి-దీని ఖరీదు?"

ఖరీదుపెట్టి కొనలేదులెండి. ఏదో శాంపిల్ రూపేణ నాకు వచ్చింది"

అబద్ధంలోని ఆనందాన్ని నేనింతవరకూ అనుభవించలేదు.

హరీష్‌బాబు అప్పుడేవచ్చి నాతో "మీరు తోసివేశారు. ఆతరువాత ఆలిండియా ఇన్సూరెన్సు ఏజంటు ఆ కేసు పుచ్చుకున్నాడు. డాక్టరు ఖగేంద్రనాథ్ ఫస్టుక్లాసు రిపోర్టు రాసిచ్చాడు. ఆరిపోర్టును నేను కళ్లారా చూశాను. మీరేమో—" అని ఆగాడు.

ఆయన భార్య "చూడండి ఒక ఆయిల్‌క్లాత్ తీసుకొని రాండి. పక్క గుడ్డలు మాటి మాటికీ తడుస్తున్నయ్." అన్నది.

"సరే-" అని హరీష్‌బాబు అన్నాడు.

"గ్లూకోజ్ కూడా అఖరైపోయింది. మరిచిపోకుండా అది తీసుకరాండి"

నాలో అశాంతి వ్యాపించింది. "ఇక నేను వెళ్తానండి" అన్నాను.

సరిగ్గా అర్ధరాత్రికి హరీష్‌బాబు కొడుకు చనిపోయాడు. తల్లి హృదయవిదారకంగా ఏడుస్తున్న ఆక్రందన మెల్లిగా విని పిస్తూవుంది. ఆ దగ్గర్లోని కార్ఖానా గొట్టంలోంచి ఎవరో పిచ్చిది నవ్వుతున్నట్లుగా—గుప్‌గుప్‌మంటూ పొగఆకాశాన్నంటుతూవుంది.

ఏదో తప్పుచేసినట్లుగా నామనసంతా బాధపడింది. ఆ పిల్ల వాడిపట్ల నేను చేయవలసిన శుశ్రూష, జాగ్రత్త—సరిగ్గా చేయ లేదేమో! తడిసిన బట్టలమీద పడుకోవడంచేతా—సరైన పథ్యం లేకా చనిపోయాడు. కానీ, హరీష్‌బాబు చిన్న పిల్లవాడికి మాత్రం టైఫాయిడ్ తగలలేదు. ఈ పిల్లవాడు ఏ విధంగా చనిపోయాడు? బహుశా పేదరికంవల్ల కామోలు!

హరీష్‌బాబుకు ఆకేసు విషయంలో అతను కోరినట్లుగ రిపోర్టు రాసిచ్చినందువల్లకలిగే నష్టమేమిటి? నే నివ్వకపోయినా, ఆఖరికి ఖగేంద్రుడు రిపోర్టు రాసిచ్చాడు. మరి నా ఆలోచనలు ఆశయాలు అన్నీ తప్పుడువేనా? అతను మధుమేహంతో లావుగా వుండి, బలహీనమైన హృదయంతో చాలా రోజులవరకు—అంటే చాలా సంవత్సరాలవరకు బతకవచ్చు! నేను మంచివాడని భావించి, మంచి రిపోర్టు రాసిచ్చిన మనిషి రెండు రోజుల తర వాత చనిపోకూడదా? ఇదెవరికి తెలుస్తుంది? హరీష్‌బాబుకు వచ్చే డబ్బును నే నన్యాయంగా పాడు చేసాను. ఇందులో ఔచి చిత్య మెక్కడుంది? నిజమేమిటి?

నా కెప్పుడు నిద్రపట్టిందో తెలీదు. కలగంటున్నాను. ఆమె' వచ్చింది. లతల్లాంటి చేతులను నా మెడచుట్టూవేసి, నన్ను ముద్దు పెట్టుకొని "నువు చేసింది మంచిపనే! ఎందుకంతగా బాధ పడతావ్?" అన్నది.

మెలకువ కలిగింది. లేచి చూచేప్పటికితెల్లవారబోతూంది. హరీష్‌బాబింట్లోంచి ఇంకా సన్నగా ఏడుపుధ్వని వినిపిస్తూనే వుంది. ఎదురుగావున్న కార్ఖానా గొట్టంలోంచి, నల్లని పొగ సుళ్లు తిరుగుతూ, ఫక్‌ఫక్ మంటూ—ఆకాశంలోకి పోతూవుంది.

# 5

"నేనిప్పుడే 'రసూల్‌పురం' వెళ్ళాలి. నాకక్కడ అర్జంటు పనుంది" అన్నాను.

ఆ మాటతో గొల్లవాడు మెదలకుండా నిలుచున్నాడు. రసూల్‌పురంలో జమీందారుగా రుంటారని, అక్కడికి నేను వెళ్లాల్సిన పనుంటుందని వాడికి తెలుసు. నేను ముందుగా అక్కడికి వెళ్లాలి. అటువంటప్పుడు వాడు నన్ను తనవూరికి తీసుక వెళ్ళగలుగుతాడా? బీదవాడు ప్రతిసారీ ఫీజివ్వలేడు. తన శక్తికొద్దీ అప్పుడపుడు పాలూ, పెరుగూ ఇచ్చి తన కృతజ్ఞతను వెల్లడించుకుంటాడు.

"అక్కడ్నుంచి తిరిగి వచ్చేప్పుడు మీ వూరికి వచ్చి చూస్తాను. మరిచిపోను. నువు ఇంటిదగ్గరే వుండు—"

వాడు వెళ్లిపోయాడు. రాసుకునేందుకు కూర్చున్నాను.

"బాగా వున్నారా డాక్టరుగారూ?"

ఎవరబ్బా?—తలెత్తి చూసాను. మహేంద్రుడు నిలుచుని వున్నాడు.

"కుశలమేనా?—" ఆయన అడిగాడు.

"ఆ! అలానే గడిచిపోతున్నాయ్ రోజులు. మీ స్థితి ఎలా వుంది?—"

"ఏమంత చెప్పదగిన సంగతులు లేవులెండి. ఐనా - నాకు వొంటినిండా దురదలు ప్రారంభమైనయ్. చూడండి.

చూసాను. ఇంకా ఎక్కువగా దురదలు ముదరలేదు. ఔషధం రాసిచ్చి "దీన్ని బాగా వొంటికి రుద్దుతూవుండండి; నయమవుతుంది. నాకు కొంచెం పనుంది; చాలామంది రోగుల్ని చూడాలి. మీ రెక్కడ ఉగారు? భోజనం చేసారా! లేదా?—" అని అడిగాను.

మహేంద్రబాబు నవ్వి వూరుకున్నాడు.

"అయితే ఇక్కడే నాతోపాటు కలో, గంజో తాగండి. భజువా!—అరే—భజువా!"

నౌకరు పరుగెత్తుకొనివచ్చాడు. వాడికి అన్నిసంగతులూ చెప్పి 'చూడు బాబుగారికి బైట కుర్చీవెయ్; ఇంకా....అరే—వెల్తావేమిటిరా? వంటాయనతో బాబుగారు ఇక్కడే భోజనం చేస్తారని చెప్పు——?"

నేను రోగులదగ్గరికి వెళ్లాను. ఎక్కడెక్కడో తిరిగాను. ఒకడికి పంటినొప్పి-మరొకడికి టి. బి., మరొహడికి మలేరియా, సన్నిపాతం - ఈరోగాలకి అంతులేనట్లుగా వుంది. ఒకరికి ఏ రోగమూ వుండదు. కానీ, మానసికమైన బాధతో దుర్బలంగా కనిపిస్తుంటాడు. ఒకాయన లావుగా వున్నాడు. కానీ, అన్నం జీర్ణం కావడంలేదని అతని అనుమానం! ఇంతకూ ఏది ఏమైనప్పటికీ నేను డాక్టర్ను గనుక అందరికీ ఏదో ఒకమందు రాసివ్వాలి! బీదవాళ్ళ సంగతెలావున్నా - గొప్పవాళ్ళకు అనేకరకాల జబ్బులతో పాటు, అనేకరకాల అనుమానాలు, జబ్బు రూపేణ వాళ్ళని పీడిస్తుంటాయి. ఏమీలేని పరిస్థితిలో వాళ్ళకు ఇంద్రియ దౌర్బల్యమన్నా ఇంద్రియ స్ఖలనమన్నా తప్పకండా వుండి వుంటుంది!

రోగుల్ని చూసి, తిరిగి తిరిగి ఇంటికి వచ్చేప్పటికి సగం పట్టణం నిద్రపోయింది. మహేంద్రుడు తిండి తిని ఎక్కడికో వెళ్ళాడని నౌకరు చెప్పాడు. నేనేదో యింత తిని - రసూల్‌పురం వెళ్లేందుకు సిద్ధమయాను. పైగా - జమీందారుగారి కారువచ్చి నా ఇంటిముందు ఆగిందికూడా!

బయల్దేరేముందు ఉన్నిదుప్పటి తీసుకవెళ్దామనుకుని, ఇంట్లోకి వెళ్ళి ఎంత వెదకినా కనిపించలేదు. భుజువా పెట్టెలూ, పరుపులూ, మంచమూ అన్నీ వెదకి విసిగిపోయాడు. కానీ,- దుప్పటి కనిపించలేదు. మాయమైపోయింది. యింతకూ యింట్లో ఒక ఆడమనిషి వున్నట్లయితే-అని ఆలోచించాను.

అనుకున్నానో లేదో-నా అంతర్భాగంలో నివసిస్తున్న 'ఆమె' ముఖం చాటు చేసుకుని నవ్వింది....

మోటారు బాణంలా దూసుకపోతూవుంది. ఇది ప్రగతి యుగం. అందులో వేగానికీ, యంత్రాలకి, సైన్సుకీ మరీను! జీవితమంతా బలంమీద ఆధారపడే రోజులుపోయినయ్. యంత్రాలమీదా, సైన్సుమీదా మానవుడు బతకడం నేర్చుకున్నాడు. మానవ విజ్ఞానం ఎంతగా మారిపోయింది!

నేను చూస్తున్న వాటినన్నిటినీ మోటారువేగంలోనే చూస్తున్నాను. కానీ,-ఏ ఒక్కటికూడా స్పష్టంగా వాటిరూపంలో కనపడడంలేదు. రోడ్డువెంట మోటారు పరుగుతీస్తూవుంది. క్షణ కాలంలోని పరిచయంతో క్షణిక దర్శనం! పూలతోనిండిన చెట్టు దాటిపోయింది. కొంతమంది గొల్లవాళ్ళు తమ ఆవులకోసం వెనక బడిపోయారు. ఎవరో బాటసారి ఒంటరిగా వెళ్తున్నాడు. అదిగో వంతెన! అందంగల ఆడది నిలుచునివుంది. ఇంకొకచెట్టు

వచ్చింది. రెండుకుక్కలు మెల్లగా ఒకదానివెంట ఒకటి పోతు న్నయ్. పక్కనించి ఇంకొక కారు సర్రుమంటూ, ధూళిలేపుతూ వెళ్ళిపోయింది. ఒకచెరువు! స్వచ్ఛమైననీరు. అదిగో ఒంటెద్దు బండిపోతూవుంది. తలమీది మూటలతో ఒకముసలిదీ, ముసలి వాడూ పోతున్నారు. ఆ ముసలిదాని శరీరం కండలు తిరిగివుంది. కొన్ని కోళ్ళు మోటారు ముందుకు వచ్చినయ్! అరే, అపు-ఆప వోయ్! కారు ఆగనేలేదు. అన్నీ బ్రతికినవ్!

సాయంకాల మవుతుండగా కారు రసూల్‌పురం చేరింది.

రసూల్‌పురం జమీందార్ చనిపోయాడు. రెండేళ్ళయింది. సంతానంలేని విధవ జమీందారిణి మాత్రం నవయవ్వనంతో ఏ కాకిగా ఈ సంపదకంతకూ ఉత్తరాధికారిణియై కూచుంది.

జమీందారుగారి కొత్తగుమాస్తా 'కుంజలాల్' నాకు ఎదు రుగావొచ్చి స్వాగతమిచ్చాడు. ప్రస్తుతం జమీందారంతా ఈయన గారి అజమాయిషిక్రిందేవుంది; తెలివితేటలవల్ల, బుద్ధిచాతుర్యం వల్ల జమీందారుగారికి ఎక్కువ రాబడి కలిగించ గలిగాడు. మాటల్లోమాత్రం వినయానికి ఆయన పెట్టనికోట! మోటారునించి దిగానో లేదో, కుంజలాల్ వచ్చి నా పాదాలు ముట్టుకున్నాడు.

"అరెరే—" అంటూ నేను వెనక్కు జరిగాను.

కుంజలాల్ నవ్వుతూ "మీరు బ్రాహ్మణులు. మాకు పూజ్యులు" అన్నాడు.

రసూల్ పురం రావడాని కిదే నాకు తొలిసారి! కుంజ లాల్‌ని నేనెరుగను? నే నాయనతో "జబ్బెవరికి?" అన్నాను.

"లోపలికి దయచేయండి. చాలా అలిసిపోయినట్లున్నారు.

కొంచెంసేపు విశ్రాంతి పుచ్చుకోండి. ఆతరవాత జబ్బుసంగతి మనం మాట్లాడుకుందాం!"

లోపలికి వెళ్లాను. నా కోసం చాలా అట్టహాసం చేసారు. ఒక నౌకరు నా కోసం కుర్చీవేసాడు. కాళ్ళూ, చేతులూ కడుక్కోనేందుకు నీళ్ళూ, సబ్బూ, తుండుగుడ్డ, 'టీ', ఫలహారమూ, ఆకులూ హుక్కా ...అన్నీ ఇంకో నౌకరు తయారుగా వుంచాడు. ఇవన్నీ చూసేప్పటికి నే నీ యింటికి అల్లుణ్ణనుకుని పొరపాటున చేస్తున్నారేమో ననుకున్నాను.

చివరికి కుంజలాల్‌తో "ఇక రోగిని చూద్దాం పదండి" అన్నాను.

"పదండి—పదండి" అన్నాడు కుంజలాల్.

"జబ్బెవరికి?–"

"రాణీగారికి"

జమీందారిణిని పరీక్షించాను. అయిదు నెలల గర్భిణని తేలింది. అంతా బాగానే వున్నారు. భయపడవలసినంత పనేమీ లేదు. మరి నన్నెందుకని పిలిచారో నాకేమీ తెలియలేదు. చాలా సేపు ఆలోచించిన తర్వాత నన్ను పిలిపించిన కారణమేమిటో బుర్రలో చటుక్కున మెరిసింది. రాణీగారు విధవకదూ?

"మీ రెంత కోరితే అంత——"

"క్షమించాలి"

"సరేలెండి. ఈ సంగతెవరికీ చెప్పకండా వుంటారని ఆశిస్తున్నాను."

"తప్పకుండా"

ఫీజుపుచ్చుకుని బైటికి వచ్చాను. మోటారు తయారుగా వుంది. నమస్కరించి, బండిలో కూర్చున్నాను. ఈసారి కుంజ లాల్ పాదధూళి తీసుకోలేదు. బండి మహావేగంతో పోతూవుంది. మనసంతా చీకాకుగా వుంది. అనవసరంగా కాలాన్ని వృధాగా గడిపాను.

"బండిని ఆపవోయ్."

అన్నట్లుగానే ఆపాడు. మోటార్లోంచి దిగాను. "తిరిగి వచ్చేప్పుడు మీ ఇంటికి వస్తాను" అని పొద్దున గొల్లవాడికి చెప్పాను. ఇదే వాళ్ళవూరు!

కాలినడకన బయల్దేరానేగాని, మనసు నాలో లేదు. ఒక కుక్క నన్ను చూసి మొరిగింది. ఆ మొరుగుడు నన్ను మేలు కొలిపింది. గొల్లవాడి యిల్లెక్కడో అడిగి తెలుసుకున్నాను.

ఇంకా లోపలికి వెళ్ళనేలేదు. నా గుండెల్లో ఎవరో దెబ్బ కొట్టినట్లయింది. అంతా ఏడుస్తూవున్నారు. నేను రావడం తెలుసుకుని చనిపోయిన కుఱ్ఱవాడితల్లి గట్టిగా ఏడుస్తూ- "ఇప్పుడా రావడం బాబూ! మా నాయన వెళ్ళిపోయాడు" అన్నది.

గుండెలు తరుక్కుపోయినయ్.

# 6

రాత్రి యింటికివచ్చి భోజనం చెయ్యలేకపోయాను. మనసెలానో వుంది.

"బాబుగారూ 'టీ' ఇవ్వమంటారా?" అని నౌకరు వినయంగా అడిగాడు. మంచంమీదకు వెళ్ళి పడుకుని "వద్దు—" అన్నాను.

నిద్రపట్టిన సంగతే నాకు తెలీదు.

మెలకువ రావడంతోనే లేచి చూసేప్పటికి చంద్రుడు అస్తమించబోతున్నాడు. క్షీణిస్తున్న వెలుతుర్లో సమస్త ధరాతలం తంద్రాతురతతో వుంది. కొన్ని గంటలు గడిచేప్పటికి ప్రపంచమంతా కోలాహల్గంతో నిండిపోతుంది! కానీ—నిర్జనమైన రాత్రిలోని ఆఖరి ఝూమున మెదలకుండా పడుకుని నిద్రపోయే భూమి వేపు చూసి, నా హృదయమంతా కరుణతో నిండిపోయింది. విడవని రోగంతో బాధపడుతున్నట్లుగా వసుంధరాదేవి నిద్రపోతూ వుంది. అభాగ్య భూదేవి తాలూకు విషాదమైన నవ్వులా మసక వెలుతురు కనిపిస్తూవుంది.

ఎదురుగా వున్న తోటలో తిరగాలని వెళ్లాను. పారుజాత వృక్షం నించి పూలు జలజల మంటూ రాలుతూవున్నయ్; భూమి మీదున్న గడ్డి—మంచుతో తడిసి పోయింది. నిశ్శబ్దమైన ప్రదేశంలో ఈ రాత్రంతా కూచుని ఎవరేడ్చారు? ఎవరు ... .. ..?

# 7

ఆ మాటలు నాకు బావుండకపోయినా వింటూన్నాను.

"మీరు నన్నెరుగరు కానీ—నళిని బాబు మాకు బాగా తెలుసు! ఆయన నాకు బావమరిది!—అంటే మేనత్త కొడుకన్న

మాట. పైగా 'పూర్ణియా జిల్లా' లోని జడ్జీలంతా నాకు బంధువులే! ఈఊళ్ళోని మిల్లు మానేజరు సర్వేశ్వరబాబు మా చిన్నాయన చెల్లెలికి మామగారవుతారు. ఒకసారి నేను మీ వూరికూ్కడా వచ్చాను. పందొమ్మిదిసందల పన్నెండునాటిమాట! అప్పుడు మీరు చాల చిన్నవారు. 'బ్రహ్మపురం'లో ప్రఖ్యాతి చెందిన డాక్టరు మా చిన్నాయన తమ్ముడికి బావమరిది. ఇంకా ఎంతోమంది నాకు తెలుసు. ఇక్కడి కమీషనర్‌గారి దగ్గరున్న 'కాళీశంకర్' బాబున్నాడే—ఆయన్ని నేను పెదనాన్నగారని పిలుస్తుంటాను. 'హరిహరపురం' ఇనస్పెక్టరు మీకు తెలుసనుకుంటాను; ఆయన మా మామగారికి మామగారవుతారు. మీవీధిలోని జీవనబాబు...."

విసుక్కుంటూ "ఇంతకీ మీకు కావల్సిందేమిటి?" అన్నాను.

"ఆ....ఆ....చిన్న అవుసరం వచ్చింది. డాక్టరు ఖగేంద్రుడు సామాన్య గృహస్తు లెవరూ ఇవ్వలేనంత డబ్బడిగాడు. మీరు చాలా దయామయులని........"

"మీ పనేమిటో చెప్పండి—"

"ఒక సర్టిఫికెట్టు కావాలి. ఖగేంద్రుడు మా మేనత్త చెల్లెలి కొడుకు! ఈ ఆసరాతో ఆయనదగ్గరకు వెళ్లాను. కానీ, బుద్ధి వచ్చింది ఏం చెప్పను? పదహారురూపాయ లడిగాడు. పదహారురూపాయలకుగాని ఆయన 'సర్టిఫికెట్' యివ్వడట!— చూడండి, ఆయన డాక్టరా లేక దోపిడి మనిషా—?"

అంతా విని "క్షమించాలి. అబద్ధపు సర్టిఫికెట్ మాత్రం ఇవ్వలేను." అన్నాను.

"అబద్ధమా? అబద్ధమెలా అవుతుంది? నేను మీతో చెప్పే దంతా అబద్ధమనుకుంటున్నారా?"

"అబద్ధమనికాదు, నిజమైతే కావొచ్చు కాని, మీ మాటల్ని విని నేను 'సర్టిఫికెట్ ఇవ్వలేను.

అతను కొంచెంసేపు మెదలకుండా వూరుకున్నాడు. దిట్ట మైన అతని కనుబొమ్మలూ, చెవులమీది వెంట్రుకలూ నిక్క పొడుచుకుని వున్నయ్. ముక్కులోంచికూడా కొన్ని వెంట్రుకలు బైటికి వచ్చినట్లున్నాయ్ గుండెమీదా, వీపుమీదకూడా వెంట్రు కలు వున్నాయనుకున్నాను. తలమీద టోపీవుంది. గడ్డం, మీసాలు గొరిగించుకున్నాడు.

క్షణంసేపు ఆయన నవ్వి "ఇటువంటి ఆపదసమయంలో మీరు నాకు సహాయం చేయకుంటే—ఇంకెవరు సహాయంచేస్తారు?" అన్నాడు.

"ఏంచేయమంటారో మీరే చెప్పండి, అసమర్థుణ్ని!"

"సరే మీకు ఫీజుయిస్తానులెండి; నా కేదో ఒకటి మీరే చేసిపెట్టాలి. గుమాస్తాపని చేసుకుంటూ ఎలానో కాలంగడుపు కుంటున్నాను .."

"క్షమించాలి. నేను సర్టిఫికెట్ ఇవ్వలేను."

"పోనీండి. మీరడిగినంత డబ్బిస్తాను. ఎంత ఇవ్వమం టారో చెప్పండి?"

"డబ్బుసంగతి కాదు. నేనిటువంటి సర్టిఫికెట్లు రాయను."

"అయితే మీకేం కావాలి? నా గుమాస్తాగిరిపోయినా ఫర్వా లేదన్నమాట."

"మీ అభిప్రాయం నా కర్థం కాలేదు!"

"నేను మాకంపెనీకి ఒక అర్జీని పంపుకున్నాను. ఇక్కడికి వచ్చిం తర్వాత నేను జబ్బులో పడ్డాను. ఒక నెలరోజుల పాటు శలవుకావాలని రాసాను. అక్కణ్నించి 'అటువంటప్పుడు ఒక మెడికల్ సర్టిఫికెట్ పంపించు' అని జవాబువచ్చింది. నేను సర్టిఫికెట్ పంపించకపోతే—నా గుమాస్తా నౌకరీ వూడిపోతుంది. ఇప్పుడు నేనేం చెయ్యాలో మీరే చెప్పండి. ఈ వూళ్ళో డాక్టర్లు ఇద్దరే వున్నారు. ఒకరు మీరూ, రెండోది ఖగేంద్రుడుగారు! ఖగేంద్రుడు నాకు అందేట్లు లేడు; మీరేమో వివేకమనీ, నీతని కొన్ని నియమాలు పాటిస్తారు. పెద్ద ఇబ్బందిలో పడిపోయాను. అని ఆయన నావేపు చూసాడు.

భజువావచ్చి "తమకోసం ఇద్దరు మనుష్యులువచ్చి బైట కూర్చున్నారు." అని చెప్పాడు.

"నా విషయం ఇంకొకసారి ఆలోచించండి" అని అత నన్నాడు,

"క్షమించాలి."

ఒక నిట్టూర్పు విడిచి, ఆయనలేచి కొంచెందూరం వెళ్ళి తిరిగివచ్చి "—నేను జబ్బుమనిషిని కానని మీరనుకోకండి; నేను నిజంగా జబ్బుతో వున్నాను! ఆకారణంతోనే గుమాస్తాపనికి శలవు పెట్టాను. ఐనా ఇంగ్లీషుమందులు నేనెప్పుడూ తినలేదు. నా దగ్గర హోమియోపతి పెట్టెవుంది. నాకు నేనే చికిత్స చేసుకుంటాను. అటువంటప్పుడు 'సర్టిఫికెట్' నాకు నేనే రాసుకుంటే ఏమవుతుంది? చెప్పండి. ఖగేంద్రుని దగ్గరికే వెళ్ళమంటారా? ఆ మనిషి మహాలోభి. పని గడుపుతాడుగాని, రెట్టింపు లాగుతాడు. అదే నాకు కష్టం" అన్నాడు.

హఠాత్తుగా నా చూపులు అతని శాలువామీద పడినయ్. అది నా శాలువా లానే వుంది. చూస్తూ వుండిపోయాను.

నా చూపుల్నిబట్టి అతను "ఏమిటిలా చూస్తున్నారు డాక్టరు గారూ? వులన్ శాలువానా? శాలువ మూలకంగానే డబ్బు సిన్ననే ఖర్చయింది. లేకపోతే ఖగేంద్రుడితోనే సర్టిఫికెట్ రాయించేవాణ్ని. పన్నెండురూపాయలకు చాలా చవకగానే దొరికిందిలెండి, అరవై రూపాయలకు తక్కువవుండదు . ."

"కాదు డెబ్బై అయిదు—"

"అంత ఖరీదు చేస్తుంది...."

"అయితే మీరు దీన్ని ఎక్కడకొన్నారు?

"ఆ నల్లమందుబాబు మహేంద్రుడు మీకు తెలుసుగదండీ, అతనిదగ్గరే కొన్నాను. ఆయన నా దగ్గరకువచ్చి "చాలా ఇబ్బందిలో వున్నాను. ఈ శాలువా వుంచుకొని పన్నెండు రూపాయలు ఇవ్వు" అని అన్నాడు. నాకూ ఆశకలిగింది; కొన్నాను. అయితే యిందులో ఏమన్నా మోసముందా ఎమిటండీ?"

"లేదు. లేదు."

వులన్ శాలువా కప్పుకొని అతను వెళ్ళిపోయాడు చలిలో వణుకుతూ నే నుండిపోయాను. పోలీసుస్టేషనుకి రిపోర్టు చేద్దామని నాకు లేదు.

నా మనసులో ఎవరో పోలీసుస్టేషనుకు కబురు చేయకుండా వుండడం న్యాయాన్ని అతిక్రమించినంత తప్పు. న్యాయానికి విరుద్ధంగా నువు ఒకప్రక్క ప్రవర్తిస్తూనే వున్నావ్! అటువంటప్పుడు ఆమనిషికి ఒక సర్టిఫికెట్టు ఇవ్వలేవూ? ఆలోచించు, అతనెంతో సంతోషిస్తాడు. నీకూ కొంత డబ్బు గిట్టుబాటవుతుంది.

